# శ్రీశైలదేవస్థానపంచాఙ్గము

## శార్వరి సంవత్సరము



ప్రచురణ:

**శ్రీ శైలదేవస్థానం,**

శ్రీశైలం పోస్టు, (మార్కాపురం ద్వారా) కర్నూలు జిల్లా,

(ఆంధ్రప్రదేశ్)

# గమనిక

మహాశయులారా !

ఈ పంచాఙ్గము భారత ప్రభుత్వము నియమించిన పంచాఙ్గ సంస్కరణ సంఘమువారు శ్రుతి, స్మృతి ప్రమాణముల కనుగుణముగ సిద్ధముచేసిన ముఖ్య సూత్రముల ననుసరించియు, వారి ఆమోదమును బడసియు, ఆంధ్ర ప్రదేశమునకే కాక అఖిలభారతదేశములోని ప్రధాన పుణ్యక్షేత్రములలో నొకటియును, ఆంధ్రప్రదేశమునకు భూమధ్య కేంద్రమును అగు శ్రీశైల మహాక్షేత్రముయొక్క (16°–?' ఉత్తర అక్షాంశ 78°–53' తూర్పు రేఖాంశ) అక్షాంశ రేఖాంశల (స్ఫుటం దృక్తుల్యాంగ చ్ఛేదయనే విషువద్ద్వయే। ప్రాక్చక్రం చలితం హీనేభాయార్కా త్కరణాగతే అంతరాంశై రథావృత్య పశ్చాచ్ఛేషై స్తథాధికే॥ ఏవం విషువతి చ్ఛాయాస్వదేశే యాదినార్ధజా। దక్షిణోత్తర రేఖాయాం సాతత్ర విషువత్ప్రభా") ఇత్యాది ప్రమాణాధారములను గైకొని అఖిలభారత కాలమాన గంటల (ఇండియా స్టాండర్డుటైం)కు సరిపోవునటుల గుణించబడినది. శ్రీశైలం దేవస్థాన పంచాఙ్గమును నాచే ప్రప్రథమముగా గుణింపజేసి ప్రచురించుచున్నందులకు హిందూదేవాదాయ ధర్మాదాయ శాఖాధిపతులు (కమిషనరు)అగు శ్రీపైడి లక్ష్మయ్యగారికిని, శ్రీశైల దేవస్థాన ఎగ్జిక్యూటివ్ ఆఫీసరు మొదలగు పెద్దలందరికిని నేనెంతయు కృతజ్ఞుడను, ఇందునుగూర్చి సమర్థులగు నధికారులచే పొందబడిన యోగ్యతా పత్రములను దీనియందు మీకు ...

... లు గంటలరూపమున ఇంగ్లీషు అంకెలలో
... సూర్యోదయ సూర్యాస్తమయ చక్రమును
... నిమిషములు ఆంధ్ర ప్రదేశమునకే కాక
... ల సూర్యోదయాస్తమయములను బట్టి
... వ్రతాదులు, ఉత్సవాదులు మొదలగు
... క్షేత్రమునందలి ఉత్సవములు, పర్వములు

... నేమేని సలహాల నొసంగించినచో
... పంచాఙ్గములో జేర్చుకొనగలను.

ఇట్లు
దైవజ్ఞ శిరోమణి,
బి. మాధవశర్మ

శ్రీగంగాపార్వతీ భ్రమరాంబా సమేత మల్లికార్జున స్వామినే నమః

# శ్రీ శార్వరినామ సంవత్సర సిద్ధాన్త పఞ్చాఙ్గమ్

శ్లో॥ శ్రీకల్యాణ గుణావహం రిపుహరం దుస్స్వప్న దోషాపహం । గంగాస్నాన విశేష పుణ్యఫలదం గోదాన తుల్యంనృణాం ।
ఆయుర్వృద్ధిద ముత్తమం శుభకరం సంతానసంపత్ప్రదం । నానాకర్మ సుసాధనం సముచితం పంచాగ మాకర్ణ్యతామ్॥

| | | | | |
|---|---|---|---|---|
| శాలివాహనశక | 1882 | | కలిగతాబ్దాః | 50 |
| విక్రమార్కశక | 2017 | | హూణశకాబ్దాః | 1960- |
| హిజిరి | 1380 | | భారతస్వరాజ్యగతాబ్దాః | 13- |

పఞ్చాఙ్గకర్తః— బ్రహ్మశ్రీ విజుమళ్ళ ఆదినారాయణశాస్త్రిగారి కుమారుడు
దైవజ్ఞ శిరోమణి, సాహిత్య విశారద, ప్రాక్పశ్చిమ జ్యోతిర్గణిత కవితా కళాప్రవీణ
విజుమళ్ళ మాధవశర్మగారిచే గుణించబడినది.

## ప్రచురణ: శ్రీశైల దేవస్థానం,

శ్రీశైలం పోష్టు, (మార్కాపురం ద్వారా) కర్నూలు జిల్లా, ఆంధ్రప్రదేశ్.

# GOVERNMENT CERTIFICATES

## GOVERNMENT OF INDIA

**INDIA METEOROLOGICAL DEPT.**

**NO. NA 16 (1)/3**

From

The Director,

Regional Meteorological Centre, Calcutta.

To

SHRI B. MADHAVA SARMA,
11-5-5 Mylarguda, Seethafalmandi,
SECUNDERABAD (A. P.)

Alipore (Calcutta),
Dated the 5th Oct, 1957
(Aswina 13, 1879)

Dear Sir,

I write to acknowledge receipt of your two letters both dated the 30th September, 1957 together with a copy of a Panchang. It is extremely gratifying to note that your Panchang has been prepared on the basis of the recommendations of the Calendar Reform Committee.

* * *

Sub:-Amanta and Vishuvanta Panchangs for 1881 Saka Era-Copies sent to this office.

Sir,

With reference to your letter dated 10-3-59 sending two copies of your panchangs mentioned above, I write to acknowledge with thanks the receipt of the same.

*Yours faithfully.*

**N. C. Lahiri,**
for Director,
Regional Met. Centre, Calcutta,
(Nautical Almanac Unit).

Alipore (Calcutat)
Dated 23rd March, 1959
(Chaitra 2, 1881 S. E.)

## GOVERNMENT OF ANDHRA PRADESH

Telephone No. 2696.

**NIZAMIAH OBSERVATORY**
**BEGUMPET**
**HYDERABAD (Dn)—16. (India).**

No. 1059/09/M/1/59

Dated 23rd October, 1959.

The Panchanga for the year "Sarvari" in Telugu, has been compiled by Sri Bijumalla Madhava Sharma on the principles recommended by the Calendar Reform Committee. The ending moments of Thithis and Nakshatras were found to tally with those in the Indian Ephemeris compiled by the Government of India. The times of rising, setting and entering Nakshatras of the planets have been calculated by Shri Sharma on the basis of planets' geocentric positions given in the Indian Ephemeris. The times of Sunrise and Sunset have been calculated for the latitude of Hyderabad.

Shri Sharma has taken keen interest and considerable pains in compiling the Panchanga on scientific basis. I hope that the Panchanga will prove useful for the purpose for which it has been compiled.

(Sd.) AKBAR ALI,
DIRECTOR.

True Copy.

పై సర్టిఫికట్ల పూర్తివివరములు మా పెద్ద పంచాంగములో ఉన్నవి.

# శ్రీశైల మాహాత్మ్యము

శ్రీశైలము సుప్రసిద్ధమైన మహాక్షేత్రము. ఈ శ్రీశైలములో నున్న మల్లికార్జునస్వామి వారి లింగము మనదేశమునగల పండ్రెండు జ్యోతిర్లింగములలో నొక్కటి. ఇచటి భ్రమరాంబాదేవి యష్టాదశశక్తులలో నొకటి. ఆసేతు హిమాచలము ప్రతివారును సంకల్పము చేప్పికొను నప్పుడీ పవిత్ర క్షేత్రమునకు నేదిక్కునందున్నదియు చెప్పికొందురు.

ఈ శ్రీశైలప్రాంతము పురాణప్రసిద్ధమైన పుణ్యభూమి. ముఖ్యముగా స్కాందపురాణాంతర్గత శ్రీశైల ఖండమందు పండ్రెండువేల అయిదువందల శ్లోకములతో నీక్షేత్ర మాహాత్మ్యము వర్ణింపబడినది.

యుగయుగాలుగా నీపవిత్రక్షేత్రమును పురాణ పురుషు లనేకులు దర్శించినట్లు ప్రతీతి కలదు. కృతయుగము నందలి హిరణ్యకశిపునకు విది దేవతార్చనా గృహమని చెప్పుదురు. త్రేతాయుగమందు శ్రీసీతారామ చంద్రుడు లీపుణ్యక్షేత్రమును దర్శించుటయే గాక తామిరువురుచేరి యొక సహస్రలింగ దేవాలయమును ప్రతిష్ఠించినట్లు గూడ చెప్పుదురు. అటులనే ద్వాపరయుగమున పంచపాండవు లీ క్షేత్రమును దర్శించి పాండవులు తలకొక లింగమును, ద్రౌపదీదేవి వేరొకలింగమును ప్రతిష్ఠించినట్లును వచింతురు. బౌద్ధమహాయుగమున శ్రీసిద్ధ నాగార్జునుండు, నిత్యనాథుడు మొదలైన రససిద్ధులు ఈ ప్రదేశములలో పరిశోధనలు గావించి మహోద్గ్రంథములను రచియించినారు. ఆదిశంకరులు తాము నీ శ్రీశైలప్రాంతమున కొంతకాలము వసించి హార్దికమైన తపస్సుచేసి శ్రీ భ్రమరాంబామల్లికార్జునులపై స్తుతి శ్లోకములపైతము రచియించిరి.

ఈ మహాక్షేత్ర మాహాత్మ్యమునుగూర్చి అసమాన కవితా సామర్థ్యముతో పలువురు కవితల్లజులు బహువిధముల కొనియాడినారు. అందు ముఖ్యముగ సుప్రసిద్ధ కవివరేణ్యులు కుమార సంభవమున నన్నెచోడుడు, భారతమున నన్నయభట్టు, శ్రీపర్వత పురాణమున శ్రీ నాగలింటి శేషనాథుడు, పండితారాధ్య చరిత్ర, బసవ పురాణములలో శ్రీ పాల్కురికి సోమనాథుడు, శివరాత్రి మాహాత్మ్యమునందు దివిజకవివరు గుండియల్ దిగ్గురనిపించిన కవిసార్వభౌముడైన శ్రీనాథుడు, ఇంకను రంగనాథుడు, రావిపాటి త్రిపురాంతకుడు, శ్రీగిరి, విన్నకోట పెద్దనవంటి పెక్కురు ప్రముఖ కవులీ క్షేత్రమును వర్ణించిరి.

ఇది చారిత్రకముగా గూడ చాల ప్రసిద్ధికెక్కిన స్థలము. ఇందలి శిలాశాసనములలో ప్రాచీనకాలపు పరిపాలకుల విషయము, దేవాలయ పునరుద్ధారక విషయములు నింకను ననేక విశేషములు గలవు. సుప్రసిద్ధ మహారాష్ట్రవీరుడు ఛత్రపతి శివాజీ మహారాజు కట్టించిన ఉన్నతోన్నతమైన గొప్పగోపురమును నేటికిని కనులపండువుగ గాంచవచ్చును.

ఇందలి శిల్పసంపదకొక ప్రత్యేకత కలదు. కోటగోడలపైనను తదితర ప్రదేశములందును అతినైపుణ్యముగ చెక్కబడిన ఆ చిత్రములలో జీవకళ ఉట్టిపడుచుండును. ప్రాచీన పురాణగాథలు ఈ చిత్రములలో శిల్పరూపమున చక్కగా నిముద్రబడినవి. అంతియగాక యిచటి శిల్పములకును నితర ప్రదేశములందలి చిత్రములకును కొన్ని విషయములలో ముఖ్యములైన భేదములు కొన్ని కలవు. అందుకు నాలుగు చేతులుగల దుర్గవిగ్రహము నొకచేతిలో పరశువుండుట ఉదాహరణగా పేర్కొన

వచ్చును. ఇతర ప్రదేశములలో పరశువు ఎనిమిది చేతులుగల దుర్గ విగ్రహములకే యుండును. ఇంతియేకాక శ్రీ మల్లికార్జున దేవాలయపు కట్టడములోని శిల్పములు భ్రమరాంబా దేవ్యాలయపు కట్టడములోని శిల్పమును తదితరములైన కట్టడములలోని శిల్పమును పరిశీలించినచో నవి యెప్పుడెప్పుడు నిర్మింపబడినది యూహించి చెప్పవచ్చును. ఇచటి రమణీయమైన ప్రకృతిసౌందర్యము కళాపిపాసకుల నాకర్షించును. ఖండఖండముల నుండి వచ్చిన పెక్కుమంది కళాభిజ్ఞులను గూడ ముగ్ధులను జేసినది. చామలోయ దృశ్యము, పాతాళగంగ దృశ్యము, దేవాలయదృశ్యము వీనిలో ముఖ్యముగ చెప్పుకొన తగినవి.

ఇదివర కీ క్షేత్రదర్శనము బహుకష్ట సాధ్యముగా నుండెడిది. వయోవృద్ధులు దేహదార్ఢ్యములేనివారు కాలి నడకలతో కొండమెట్లెక్కి పర్వమైళ్ళు నడచి రాజాలకుండిరి. ఇటీవల దేవాలయ ద్వారమువరకు చక్కనిరోడ్డు నిర్మింపబడిన తరువాత యాత్రికుల సౌకర్యార్థమై మహాశివరాత్రికి, సంవత్సరాదికి నడుపబడు ప్రత్యేకములగు బస్సులుగాక ఇతర కాలములలో ప్రతిదినమును రెండుబస్సులు - ఒక్కటి మార్కాపురము నుండియు-రెండవది కర్నూలు నుండియు - దేవాలయము పక్షముననే దేవాలయము వరకు నడుపబడుచున్నవి.

యాత్రికుల వసతి సౌకర్యములకుగాను కొన్ని భవనములు కట్టబడినవి. ఇంకను మరికొన్ని కట్టబడుచున్నవి.

పోస్టాఫీసు, పోలీసుస్టేషను, భోజనఫలహారశాలలు, వస్తువిక్రయశాలలును ఏర్పరుపబడినవి. పాతాళగంగనుండి నిర్మలోదకము పైకి తెప్పించబడుచున్నది. విద్యుచ్ఛక్తి సౌకర్యమేర్పరుప బడినది. ఈ యమూల్యములైన అవకాశములను వినియోగించుకొని యాత్రికులు ఇతోధికముగా విచ్చేసి శ్రీ భ్రమరాంబా మల్లికార్జునులను దర్శించి, సేవించి వారి పరిపూర్ణ కటాక్షమునకు ననుగ్రహమునకు పాత్రులగుదురు గాక.

ఈ క్రింద పేర్కొన్న పద్ధతిగా రుసుము చెల్లించి యాత్రికులు అర్చనలు, సేవలు మొదలైనవి తమ పేరుమీద జరిపించుకొన వచ్చును.

# ప్రత్యేక అర్చనలు

## శ్రీ మల్లికార్జునస్వామి దేవాలయము

| | రు.న.పై. |
|---|---|
| 1. ప్రతి దర్శనము మరియు ప్రవేశమునకు రుసుము | 1·00 |
| 2. ప్రతి కర్పూర హారతి కొబ్బరికాయ లేక వత్తులు వెలిగించినందుకు | 0·50 |
| 3. మహాన్యాస పూర్వక కాతక, శతానువాకసహితఅతిరుద్రాభిషేకము 1331ఆవృ | 1116·00 |
| 4. మహాన్యాస పూర్వక కాతక, శతానువాక సహిత మహారుద్రాభిషేకము 121 ఆవృత్తులు | 250·00 |
| 5. మహాన్యాస పూర్వక కాతక శతానువాక సహిత రుద్రాభిషేకము 11ఆవృత్తులు | 116·00 |
| 6. మహాన్యాస సకృద్వార అభిషేకము ఏకావృత్తి | 50·00 |
| 7. మహాన్యాస పూర్వక మహారుద్రాభిషేకము121ఆవృత్తులు | 50·00 |
| 8. మహాన్యాస పూర్వక రుద్రాభిషేకము 11 ఆవృత్తులు | 25·00 |
| 9. మహాన్యాస పూర్వక సకృద్వారాభిషేకము ఏకావృత్తి | 15·00 |

| | రూ.న.పై. |
|---|---|
| 10. లఘున్యాస రూపక రుద్రాభిషేకము 11 ఆవృత్తులు | 20·00 |
| 11. లఘున్యాసరూపక సకృద్వారాభిషేకముఏకావృత్తి | 10·00 |
| 12. రుద్రాభిషేకము 11 ఆవృత్తులు | 15·00 |
| 13. సకృద్వారాభిషేకము ఏకావృత్తి | 5·00 |
| 14. పురుష సూక్తవిధాన శైవసహస్రనామ పూజ | 6·00 |
| 15. శివసహస్ర నామపూజ | 5·00 |
| 16. భృంగిపూజ | 5·00 |
| 17. పురుషసూక్త విధాన త్రిశతి పూజ | 4·00 |
| 18. త్రిశతిపూజ | 3·00 |
| 19. పురుషసూక్త విధాన శివ అష్టోత్తర శతనామ పూజలు | 3·50 |
| 20. శివాష్టోత్తరశతనామపూజ | 2·50 |
| 21. పంచామృతస్నానము | 2·50 |
| 22. *లక్షబిల్వార్చన లేక లక్ష కుసుమార్చన లేక సహస్రఘటాభిషేకము | 116·00 |
| 23. జరుపు దండములు, పొర్లుదండములు | 5·00 |
| 24. పుట్టు వెండ్రుకలు | 6·00 |
| 25. ఉపనయనము | 25·00 |
| 26. వివాహము | 25·00 |
| 27. నందిసేవ | 30·00 |
| 28. కైలాస వాహనము లేక రావణ సేవ | 40·00 |
| 29. పల్లకీసేవ | 20·00 |
| 30. రుద్రాక్ష సేవ | 25·00 |
| 31. దర్పణసేవ | 5·00 |
| 32. మహానైవేద్యము వండినది | 2·00 |

శ్రీ భ్రమరాంబా దేవి ఆలయము.

| | రూ.న.పై. |
|---|---|
| 1. శ్రీ సూక్తవిధాన సహస్రనామ పూజ | 6·00 |
| 2. సహస్రనామపూజ | 5·00 |
| 3. శ్రీసూక్త విధాన త్రిశతి | 4·00 |
| 4. త్రిశతి | 3·00 |
| 5. శ్రీ సూక్తవిధాన ఖడ్గమాలపూజ | 4·00 |
| 6. శ్రీదేవి ఖడ్గమాల పూజ | 3·00 |
| 7. శ్రీ సూక్తవిధాన అష్టోత్తర శత నామపూజ | 3·00 |
| 8. అష్టోత్తర శతనామపూజ | 2·50 |
| 9. కర్పూర హారతి, కొబ్బరికాయ లేక వత్తులు వెలిగించుటకు | 0·50 |
| 10. వస్త్రాలంకరణము | 5·00 |
| 11. మహానివేదన | 5·00 |
| 12. దర్పణసేవ | 5·00 |
| 13. గండదీపము | 2·50 |
| 14. *లక్ష కుంకుమార్చన లేక లక్ష పుష్పార్చన | 116·00 |

(*ఈ పూజలకు కావలసిన పూజాద్రవ్యము అన్నియు ఋత్విక్కులు వారి దక్షిణలు అన్నియు పూజ చేయించుకొనువారు ఏర్పాటు చేయించుకొన వలయును.

నిత్య హారతి

శ్రీశైల మల్లికార్జునస్వామివారి దేవాలయములో గాని, శ్రీ భ్రమరాంబాదేవి వారి ఆలయములోగాని జరిగెడి నిత్యార్చన కాలములో నిత్యము భక్తులు గోత్రనామములు చదివించు కొనదలచిన వారు సంవత్సరమునకు రూ. 25/– చెల్లించవలెను.

అటులనే పై దేవాలయములలో దేనిలోనైనను నిత్యహారతి సమయములో గోత్రనామములు చదివించుకొన దలచిన భక్తులు సంవత్సరమునకు రు. 12/–చెల్లించిన చాలును.

శ్రీ మల్లికార్జునస్వామి విభూతి ప్రసాదము శ్రీ భ్రమరాంబాదేవి కుంకుమ ప్రసాదము వలయుభక్తులు ఎగ్జిక్యూటివు ఆఫీసరుగారి పేర రు. 1/– మణియార్డరుచేసి వారి పూర్తివిలాసము తెల్పిన పై నుదహరించిన ప్రసాదము పంపబడును.

## శాశ్వత అర్చన నిధులు

ఈ క్రింద చూపబడిన విరాళములు చెల్లించు వారిపేరగాని, తెలియజేయు వారి పేరగాని క్రింద చూపబడిన అర్చనలు (శివరాత్రి, సంవత్సరాది ఉత్సవ దినములలోగాక ఇతర దినములలో) వారు కోరునట్టి ఒక దినమున శాశ్వతముగా జరుపబడును. ఇందుకుగాను విరాళముల పైవచ్చు వడ్డీమాత్రమే ఉపయోగించబడును.

### శ్రీ మల్లికార్జునస్వామివారి దేవస్థానం

| | రు.న.పై. |
|---|---|
| 1. మహాన్యాస పూర్వక కాతక శతానువాక సహిత రుద్రాభిషేకము 11 అవృత్తులు | 4000·00 |
| 2. మహాన్యాస పూర్వక కాతక, శతానువాక సహిత సకృద్వారాభిషేకము ఏకావృత్తి | 2000·00 |
| 3. మహాన్యాస పూర్వక మహారుద్రాభిషేకము 121 ఆ. | 2000·00 |
| 4. మహాన్యాస పూర్వక రుద్రాభిషేకము 11 అవృత్తులు | 1000·00 |
| 5. మహాన్యాస పూర్వక సకృద్వారాభిషేకం ఏకావృత్తి | 600·00 |
| 6. లఘున్యాస పూర్వక రుద్రాభిషేకము 11 అవృత్తులు | 800 00 |
| 7. లఘున్యాస పూర్వక సకృద్వారాభిషేకము ఏకావృత్తి | 400 00 |
| 8. రుద్రాభిషేకము 11 అవృత్తులు | 600 00 |
| 9. సకృద్వారాభిషేకము ఏకావృత్తి | 200·00 |
| 10. పంచామృతస్నానము | 100 00 |
| 11. అష్టోత్తరశతనామపూజ | 100·00 |
| 12. సహస్రనామ పూజ | 200·00 |

### శ్రీ భ్రమరాంబాదేవి వారి దేవస్థానము

| | రు.న.పై. |
|---|---|
| 1. సహస్రనామ పూజ | 200 00 |
| 2 అష్టోత్తరశతనామపూజ | 100·00 |

"శ్రీశైలే శిఖరందృష్ట్వా పునర్జన్మ న విద్యతే" యను నార్యోక్తియే యీ క్షేత్ర మాహాత్మ్యమును వేనోళ్ళచాటును. శిఖర దర్శనము గావించుకొని భక్తులు ముక్తిని సాధింతురుగాత! పాతాళగంగను దర్శించియందలి పావనోదకముల స్నానమాది సమస్త పాప విముక్తులగుదురుగాక! సాక్షి గణపతి దేవాలయము, అన్నపూర్ణాలయము, కుమారస్వామి గుడి, రాజరాజేశ్వరీ దేవ్యాలయము, పాండవులు ప్రతిష్ఠించిన యీశ్వర దేవాలయములు, శ్రీ సీతారాములు ప్రతిష్ఠించిన సహస్రలింగేశ్వరాలయములు దర్శించి ధన్యులగుదురు గాత! జన్మమున కొక శివరాత్రి యందురుగదా పెద్దలు. ఆ పుణ్యదినమున శ్రీశైల మహాక్షేత్రములో జాగరణము జరిపి దేవోత్సవములలో పాల్గొని తరింతురుగాక! ఉగాదికి జరుగు ప్రత్యేకోత్సవములు, చండీయాగము, అమ్మవారి పూజలయందు పాల్గొని ధన్యులగుదురు గాత! ఈ పర్వదినము లందేగాక ప్రతినెలలోను చవితి తిథులలో శ్రీరత్నగర్భ గణపతికి ప్రత్యేక అభిషేకములు పూజలు, శ్రీ మల్లికార్జునస్వామివారికి ప్రతి మాసశివరాత్రినాడును, ప్రతి ఏకాదశి నాడును, ప్రతిపూర్ణిమనాడును, ప్రతి అమావాస్యనాడును. ప్రత్యేక అభిషేకములు, ప్రతి సోమవారమునాడును శ్రీవారికి నందివాహన రావణవాహన సేవలు జరుగును. ప్రతి శుక్రవారమునాడును శ్రీ భ్రమరాంబాదేవి వారికి ప్రత్యేకపూజలు పల్లకీసేవ జరుగును. ప్రతి మంగళవారమునాడును శ్రీఅమ్మవారికి ప్రత్యేక పూజలు జరుపబడును. ఈ ఉత్సవములలో పాల్గొని ముక్తులగుదురు గాక!

విభూతిమఠము, సిద్ధులమఠము, నందులమఠము, ఘంటార్గమఠము, సారంగేశ్వరమఠము, ఆరామ వీరేశ్వరమఠము అనెడి మఠములను సంది

తీర్థము, నందితీర్థము, శుల్కతీర్థము, కోమలితీర్థము, కీర్తితీర్థము, గంగతీర్థము, తామరతీర్థము, విచిత్రతీర్థము, భారతితీర్థము, చారుఘోషిణీతీర్థము, అరుషిణీతీర్థము, మహాజ్యోతితీర్థము, జయతీర్థము, చతుర్వాకతీర్థము, రుచితీర్థము, క్షీరతీర్థము, బిందుతీర్థము, శంఖతీర్థము, వరాహతీర్థము, చక్రతీర్థము మున్నగు పుణ్యతీర్థములను, త్రిపురాంతక, వైఢూర్య, పశ్చిమ, మాణిక్య, పుష్పశిల, రౌప్య, హేమ, అహోబల, మరకతవజ్ర, అమరేశ్వర శిఖరములను, బ్రహ్మగిరి, రుద్రగిరి, విష్ణుగిరి, అను గిరిత్రయమును సందర్శించి ధన్యులగుదురుగాక!

ఇంతియేకాక ఛత్రపతి శివాజీ నిర్మింపచేసిన మహోన్నతమైన గోపురము, శ్రీకృష్ణ దేవరాయల మండపము, ప్రతాపరుద్రమండపము, హరిహరరాయలమండపము, తెలుగురాయల మండపము, చంద్రమహలు, క్రొత్తయాత్రికుల సౌకర్యార్థమై కట్టబడిన ఇంకను కట్టబడుచున్న భవనములు, శనగల నందికోట గోడలపైనను ఇతర ప్రదేశములందును చెక్కబడిన నవదుర్గలు నౌకాదళ భైరవులు పురాణగాథలు మొదలైనవానిని కనులార గాంచెదరు గాక!

ఒకప్పు డీ పావనక్షేత్రము మహదైశ్వర్యములతో తులతూగుచుండెను. ఈ దేవాలయపు గోడలకు బంగారపురేకు లమర్పబడి యుండెనవి. ఇప్పుడా బంగారు రేకులు లేకపోవుటయేగాక గోడలుకూడ కూలిపోవు స్థితికి వచ్చినవి. ఆనాటిరాజులు అనేక గ్రామాలు స్వామికి సమర్పించినట్లు ఇచటి శాసనములవల్ల తెలియుచున్నది. ఈనాడు గ్రామాలులేవు. జాగీరులు లేకపోవుటయే కాక దేవునికి ఒక్క సెంటు భూమి అయినను, అస్తి నాస్తి. అంతరాలయములో ముఖమండపములో పెద్ద పెద్ద రాతిదూలములు పగిలిపోయి యుండెను. అంతంతదూలములు కూడ నీనాడు మరమ్మత్తు చేయబడినవి. అసమాన శిల్ప చాతుర్యముతో చెక్కబడిన పురాణగాథలు గల కోటగోడలు కూలిపోవుచున్నవి. చరిత్ర ప్రసిద్ధ గోపురములు, శ్రీ శివాజి మహారాజు కట్టించిన గోపురముకూడ శిథిలమై బీటలువారి యిప్పుడో అప్పుడో పడిపోవు ప్రమాదకర పరిస్థితులలో నున్నవి. మరికొన్ని గోపురములు పూర్తిగ కూలిపోయినవి. శిల్పకళానిలయములైన మంటపములు ప్రతాపరుద్ర హరిహర రాయల మంటపములు సైతము క్రిందికిక్రుంగి నేడో రేపో పడిపోవు స్థితికి వచ్చినవి. దేవాల యావరణ లోపలగూడ పరచిన బండలు సమత్వము లేక లోపలకు క్రుంగినవి. మనుష్యుని యెత్తు గడ్డిగాదము పెరిగి ముండ్ల చెట్లతో యాత్రికులకు నిబ్బంది కలిగించుచుండెవి. శ్రీ మల్లికార్జున స్వామివారి దేవాలయమునకును, శ్రీ భ్రమరాంబాదేవి ఆలయమునకు మధ్య ఎగుడు దిగుడుగానుండి మార్గము సరిలేక రాకపోకల కిబ్బంది కలుగుచుండెవిది. యాత్రికులకు వసతి భోజన పానీయాదు లొనర్చుటకు సౌకర్యములు, విద్యుత్సౌకర్యములు తగినంత లేకుండెను. ఈ మధ్యనే మహోజ్వలముగా పునర్నిర్మాణ కార్యక్రమము ప్రారంభింపబడినది. ముఖమండపములో విరిగిన పెద్దరాతిదూలము తీయించి మరమ్మత్తు చేయించబడెను. అమ్మవారి ఆలయమువైపు పడిపోయిన కోటగోడ తిరిగి నిర్మింపబడినది. ఆవరణలోని బండలు ఎత్తించి లెవెలు చేయించి మరల గడ్డిగాదము మొలవకుండుటకై సిమింటు కాంక్రీటు చేయబడుచున్నది. దేవాలయముల గోడలకు మొజైకరాళ్ళు అమర్పబడుచున్నవి.

దేవాలయముల ద్వారములకు ఇత్తడిరేకు లమర్చబడుచున్నవి. శ్రీ అమ్మ వారి దేవాలయమునకును శ్రీ మల్లికార్జునస్వామివారి దేవాలయమునకును మధ్య విశాలమైన చక్కనిమెట్లు నిర్మింపబడినవి. శ్రీ సీతాదేవిచే ప్రతిష్ఠింపబడిన సహస్ర లింగేశ్వరాలయము పునరుద్ధరింపబడినది. భారత ప్రభుత్వమువారిచే 44 వేల రూపాయల ఖర్చుతో ఒక విశ్రాంతి భవనము కట్టబడినది. వీర శైవ సంఘమువారు 2 లక్షల విలువచేయు సత్రమును కట్టుచున్నారు.

ఈ విధముననే గుంటూరు జిల్లావారు 24 భవనముల నిర్మించు చున్నారు. దేవాలయ పక్షమున 96 గదులుకల సత్రముల నిర్మించు చున్నారు. రాష్ట్రప్రభుత్వమువారు ఒకలక్ష యిరవై వేల రూపాయల వ్యయముతో విద్యుచ్ఛక్తి సౌకర్యములను కలిగించుచున్నారు. ఆర్యవైశ్య సంఘమువారు వేరొక సత్రమును నిర్మాణము చేయుచున్నారు. అనంత పురము జిల్లాలోని యుదారహృదయులు తాము కొంతయు దేవాలయము కొంతయును భరించు ప్రణాళికక్రింద 70 వేల రూపాయలు విలువచేయు విశ్రాంతి భవనములు నిర్మించినారు. ఈ విధముగ కొంతవరకు పనులు జరిగినను ఇకముందు జరుగవలసిన పను లనేకములు కలవు. అవి అన్నియు నెరవేరుటకు లక్షలాది ద్రవ్యము అత్యవసరము. కావున యథాశక్తిని భక్తులందరును సహాయముచేయ ప్రార్థితులు.

శ్రీశైలం (P.O.)
వయా–మార్కాపురం,
కర్నూల్ జిల్లా, [ఆంధ్రప్రదేశ్]

ఇట్లు,
సి. రాజగోపాలరాజు.
శ్రీశైల దేవస్థానం ఎగ్జిక్యూటివ్ ఆఫీసర్.

# శ్రీశైల దేవస్థానమున జరుపబడు ఉత్సవముల వివరము

1. ప్రతినిత్యము శ్రీ మల్లికార్జునస్వామివారికి ఏకాదశ రుద్రాభిషేకం, సహస్ర నామార్చనము;

శ్రీ భ్రమరాంబాదేవికి ఉదయము సహస్రనామార్చనము, సాయంత్రము అష్టోత్తర శతనామా, ఖడ్గమాలా, త్రిశతినామావళీ పూజయు జరుపబడును.

2. ప్రతి సోమవారము ఉదయము శ్రీ మల్లికార్జునస్వామివారికి మహాన్యాసపూర్వక మహారుద్రాభిషేకము; సాయంత్రము శ్రీ భ్రమరాంబా మల్లికార్జునస్వామివారికి నందివాహన సేవయు జరుగును.

3. ప్రతి మంగళవారము శ్రీ భ్రమరాంబాదేవికి విశేషోత్సవము జరుగును.

4. ప్రతి శుక్రవారము శ్రీ భ్రమరాంబాదేవికి విశేషోత్సవము, సహస్ర కుంకుమార్చనము, శ్రీ భ్రమరాంబా మల్లికార్జునస్వామివారికి నందివాహన సేవయు జరుగును.

1969 శ్రీ చాంద్ర చైత్రమాసః

మార్చి 28 సో. శ్రీశైలక్షేత్రే వసంత నవరాత్రారంభః, కలశ స్థాపన, అగ్ని ప్రతిష, చండీ మహావిద్యా పారాయణ, శ్రీ చాంద్రవత్సరాదిః; పంచాంగశ్రవణం; శ్రీ మల్లికార్జునస్వామినాం మహారుద్రాభిషేకః; శ్రీ భ్రమరాంబా మల్లికార్జునస్వామినాం నందివాహన సేవ.

31 గు. శ్రీ రత్నగర్భ వినాయకస్వామినాం ఉపనిషన్మంత్రాభిషేకః; మూలమంత్ర జపహోమతర్పణాదిః; సహస్రనామపూజ; శ్రీ మల్లికార్జునస్వామినాం కృత్తికా దర్శనం.

ఏప్రిల్ 6 బు. శ్రీశైలక్షేత్రే పూర్ణాహుతిః. అవభృథః

10 ఆ. శ్రీ మల్లికార్జునస్వామినాం మాసోత్సవః, మహారుద్రాభిషేకః, రావణాసుర వాహనసేవా.

11 సో. శ్రీశైలక్షేత్రే దవనోత్సవః, శ్రీ మల్లికార్జునస్వామినాం మహారుద్రాభిషేకః, న్యాసాభిషేకః, శ్రీభ్రమరాంబాదేవ్యాః లక్షకుంకుమార్చనా, చండీ మూలమంత్రజపానుష్ఠాన తర్పణ హోమాదయః

14 గు. శ్రీ రత్నగర్భ స్వామినాం ఉపనిషన్మంత్రాభిషేకః: గణపత్యుత్సవః; శ్రీ రత్నగర్భ మూలమంత్ర జపతర్పణ హోమాదులును; సహస్రనామ పూజలును జరుగును.

24 ఆ. మాసశివరాత్రిః; శ్రీ మల్లికార్జున స్వామినాం మహాన్యాస పూర్వక మహారుద్రాభిషేకః; (121ఆవృతులు)లక్షబిల్వార్చన; పంచకాతక పారాయణ; పంచాక్షరీ మూలమంత్ర జపతర్పణ హోమాదయః శ్రీ భ్రమరాంబా మల్లికార్జునస్వామినాం కైలాసవాహన సేవా.

25 సో. శ్రీ మల్లికార్జున స్వామినాం న్యాసాభిషేకః; మహాన్యాసపూర్వక మహారుద్రాభిషేకః.

ఏప్రిల్ **శ్రీ చాంద్ర వైశాఖమాసః**

27 బు. శ్రీ మల్లికార్జునస్వామినాం కృత్తికా దర్శనం.

29 శు. శ్రీ రత్నగర్భ వినాయకస్వామినాం ఉపనిషన్మంత్రాభిషేకః; గణపత్యుత్సవః. శ్రీ రత్నగర్భ మూలమంత్ర జపతర్పణ హోమాదులును; సహస్రనామ పూజలును జరుగును.

మే

[illegible] సో. శ్రీ మల్లికార్జున స్వామినాం మహారుద్రాభిషేకః; మాసోత్సవః శ్రీ భ్రమరాంబా మల్లికార్జునస్వామినాం రావణాసుర వాహనసేవా.

10 మం. శ్రీ మల్లికార్జునస్వామినాం న్యాసాభిషేకః; శ్రీ భ్రమరాంబా దేవ్యాః లక్షకుంకుమార్చనా; చండీమూలమంత్ర జపానుష్ఠాన తర్పణ హోమాదయః

14 శ. శ్రీ రత్నగర్భ వినాయక స్వామినాం ఉపనిషన్మంత్రాభిషేకః; గణపత్యుత్సవః; శ్రీ రత్నగర్భ మూలమంత్ర జప తర్పణ హోమాదులును: సహస్రనామ పూజలును జరుగును.

23 సో. శ్రీశైలక్షేత్రే మాసశివరాత్రిః; శ్రీ మల్లికార్జునస్వామినాం మహారుద్రాభిషేకః; శ్రీ భ్రమరాంబా మల్లికార్జునస్వామినాం కైలాస వాహనసేవా; శ్రీ మల్లికార్జునస్వామినాం మహాన్యాసపూర్వక మహారుద్రాభిషేకః. (121 ఆవృతులతో) లక్ష బిల్వార్చన; పంచ శాతక పారాయణ; పంచాక్షరీ మూలమంత్ర జప తర్పణహోమాదయః

24 మం. శ్రీ మల్లికార్జున స్వామినాం న్యాసాభిషేకః; కృత్తికా దర్శనం;

మే **శ్రీ చాంద్ర జ్యేష్ఠమాసః**

29 ఆ. శ్రీ రత్నగర్భ వినాయకస్వామినాం ఉపనిషన్మంత్రాభిషేకః. గణపత్యుత్సవః; శ్రీ రత్నగర్భ మూలమంత్ర జప తర్పణ హోమాదులును; సహస్రనామ పూజలును జరుగును.

జూన్

8 బు. శ్రీ మల్లికార్జునస్వామినాం మాసోత్సవః; మహారుద్రాభిషేకః; శ్రీ భ్రమరాంబా మల్లికార్జునస్వామినాం రావణాసుర వాహనసేవా.

9 గు. శ్రీ మల్లికార్జునస్వామినాం న్యాసాభిషేకః; శ్రీ భ్రమరాంబా దేవ్యాః లక్షకుంకుమార్చనా; చండీ మూలమంత్ర జపానుష్ఠాన తర్పణ హోమాదయః.

12 ఆ. శ్రీ రత్నగర్భ వినాయకస్వామినాం ఉపనిషన్మంత్రాభిషేకః; గణపత్యుత్సవః. శ్రీ రత్నగర్భ మూలమంత్ర జప తర్పణ హోమాదులును; సహస్రనామ పూజలును జరుగును.

21 మం. శ్రీ మల్లికార్జునస్వామినాం కృత్తికాదర్శనం.

22 బు. శ్రీశైలక్షేత్రే మాసశివరాత్రిః; శ్రీ మల్లికార్జునస్వామినాం మహారుద్రాభిషేకః; శ్రీ భ్రమరాంబా మల్లికార్జునస్వామినాం కైలాస వాహనసేవా. శ్రీ మల్లికార్జున స్వామినాం మహాన్యాసపూర్వక మహారుద్రాభిషేకః; (121 ఆవృతులు) లక్ష బిల్వార్చన; పంచ శాతక పారాయణ. పంచాక్షరీ మూలమంత్ర జప తర్పణ హోమాదయః.

23 గు. శ్రీ మల్లికార్జునస్వామినాం న్యాసాభిషేకః.

## శ్రీ చాంద్ర ఆషాఢమాసః

జూన్ శ్రీ రత్నగర్భ వినాయక స్వామినాం ఉపనిషన్మంత్రాభిషేకః;
28 మం. శ్రీరత్నగర్భ మూలమంత్ర జపతర్పణ హోమాదులును; సహస్ర నామపూజలును జరుగును.

జులై

7 గు. శ్రీ మల్లికార్జునస్వామినాం మాసోత్సవః; మహారుద్రాభిషేకః; శ్రీ భ్రమరాంబా మల్లికార్జునస్వామినాం రావణాసుర వాహనసేవా.

8 శు. శ్రీ మల్లికార్జునస్వామినాం న్యాసాభిషేకః; శ్రీ భ్రమరాంబాదేవ్యాః లక్ష కుంకుమార్చనా; చండీమూలమంత్ర జపానుష్ఠాన తర్పణ హోమాదయః.

11 సో. శ్రీ రత్నగర్భ వినాయక స్వామినాం ఉపనిషన్మంత్రాభిషేకః; గణపత్యుత్సవః; శ్రీరత్నగర్భ మూలమంత్ర జపతర్పణ హోమాదులును. సహస్రనామ పూజలును జరుగును.

18 సో. శ్రీ మల్లికార్జున స్వామినాం కృత్తికా దర్శనం.

21 గు. శ్రీశైలక్షేత్రే మాసశివరాత్రిః; శ్రీ మల్లికార్జున స్వామినాం మహారుద్రాభిషేకః; శ్రీ భ్రమరాంబా మల్లికార్జున స్వామినాం కైలాస వాహనసేవా; శ్రీ మల్లికార్జునస్వామినాం మహాన్యాస పూర్వక మహారుద్రాభిషేకః; (121 ఆవృతులు) లక్ష బిల్వార్చన; పంచ కాతక పారాయణ; పంచాక్షరీ మూలమంత్ర జప తర్పణ హోమాదయః.

23 శ. శ్రీ మల్లికార్జునస్వామినాం న్యాసాభిషేకః.

## శ్రీ చాంద్ర శ్రావణమాసః

జులై

26 మం. శ్రీ మంగళగౌరీ పూజా మహోత్సవః.

27 బు. శ్రీ లక్ష్మీ గణపత్యభిషేక మహోత్సవః; శ్రీ రత్నగర్భ వినాయక స్వామినాం ఉపనిషన్మంత్రాభిషేకః; గణపత్యుత్సవః.

ఆగస్టు

2 మం. శ్రీ మంగళగౌరీపూజా మహోత్సవః

5 శు. శ్రీ మల్లికార్జునస్వామినాం మాసోత్సవః. మహారుద్రాభిషేకః; అభిషేకోత్సవః; శ్రీ భ్రమరాంబా మల్లికార్జునస్వామినాం రావణాసుర వాహనసేవా.

6 శ. శ్రీ మల్లికార్జునస్వామినాం న్యాసాభిషేకః; అభిషేకోత్సవః; శ్రీ భ్రమరాంబాదేవ్యాః లక్ష కుంకుమార్చనా; చండీ మూలమంత్ర జపానుష్ఠాన తర్పణ హోమాదయః.

9 మం. శ్రీ మంగళగౌరీ పూజా మహోత్సవః.

10 బు. శ్రీ లక్ష్మీ గణపత్యభిషేక మహోత్సవః; శ్రీరత్నగర్భ వినాయక స్వామినాంఉపనిషన్మంత్రాభిషేకః; గణపత్యుత్సవః; శ్రీరత్నగర్భ మూలమంత్ర జపతర్పణ హోమాదులును; సహస్రనామ పూజలు జరుగును.

14 ఆ. శ్రీ మల్లికార్జునస్వామినాం కృత్తికా దర్శనం.

16 మం. శ్రీ మంగళగౌరీపూజా మహోత్సవః

20 శ. శ్రీశైలక్షేత్రే మాసశివరాత్రిః; శ్రీ మల్లికార్జునస్వామినాం మహారుద్రాభిషేకః; శ్రీ భ్రమరాంబా మల్లికార్జునస్వామినాం కైలాస వాహనసేవా; శ్రీ మల్లికార్జునస్వామినాం మహాన్యాస పూర్వక

మహారుద్రాభిషేకః(121ఆవృతులు)లక్షబిల్వార్చన; పంచకాతక పారాయణ; పంచాక్షరీ మూలమంత్ర జపతర్పణ హోమాదయః.
21 ఆ. శ్రీ మల్లికార్జునస్వామినాం న్యాసాభిషేకః.

శ్రీ చాంద్ర భాద్రపదమాసః

ఆగస్టు 28 బు. శ్రీ రత్నగర్భ వినాయకస్వామినాం ఉపనిషన్మంత్రాభిషేకః; గణపత్యుత్సవః; శ్రీ వరసిద్ధి వినాయకస్వామినాం నవరాత్రోత్సవారంభః; కలశస్థాపనం. శ్రీ రత్నగర్భ మూలమంత్ర జపతర్పణ హోమాదులును; సహస్రనామ పూజలును జరుగును.
సెప్టెం శ్రీ మల్లికార్జునస్వామినాం మాసోత్సవః; మహారుద్రాభిషేకః
4 ఆ. శ్రీ భ్రమరాంబా మల్లికార్జునస్వామినాం రావణాసుర వాహనసేవా. శ్రీ వరసిద్ధి వినాయకస్వామినాం నవరాత్రోత్సవ పరిసమాప్తిః; పూర్ణాహుతిః; అవభృథః.
5 సో. శ్రీ మల్లికార్జునస్వామినాం న్యాసాభిషేకః; మహారుద్రాభిషేకః; శ్రీ భ్రమరాంబా మల్లికార్జుస్వామినాం నందివాహనసేవా. శ్రీ భ్రమరాంబాదేవ్యాః లక్షకుంకుమార్చనా; చండీ మూలమంత్ర జపానుష్ఠాన తర్పణ హోమాదయః.
8 గు. శ్రీ రత్నగర్భ వినాయకస్వామినాం ఉపనిషన్మంత్రాభిషేకః; గణపత్యుత్సవః. శ్రీ రత్నగర్భ మూలమంత్ర జపతర్పణ హోమాదులును; సహస్రనామ పూజలును జరుగును.
10 శ. శ్రీ మల్లికార్జునస్వామినాం కృత్తికాదర్శనం.
19 సో. శ్రీశైలక్షేత్రే మాసశివరాత్రిః; శ్రీ మల్లికార్జునస్వామినాం మహారుద్రాభిషేకః; శ్రీ భ్రమరాంబా మల్లికార్జునస్వామినాం కైలాసవాహనసేవా. శ్రీ మల్లికార్జునస్వామినాం మహాన్యాసకపూర్వక మహారుద్రాభిషేకః; (121 ఆవృత్తులు) లక్షబిల్వార్చన; పంచకాతక పారాయణ; పంచాక్షరీ మూలమంత్ర జప తర్పణ హోమాదయః.
20 మం. శ్రీ మల్లికార్జునస్వామినాం న్యాసాభిషేకః.

శ్రీ చాంద్ర ఆశ్వీజమాసః

సెప్టెం శ్రీశైలక్షేత్రే శ్రీ దేవీ శరన్నవరాత్రారంభః; అపరాజితాయాగ
21 బు. ప్రారంభః; కలశ స్థాపనం.
24 శ. శ్రీ రత్నగర్భ వినాయకస్వామినాం ఉపనిషన్మంత్రాభిషేకః; గణపత్యుత్సవః. శ్రీ రత్నగర్భ మూలమంత్ర జపతర్పణ హోమాదులును. సహస్రనామపూజలును జరుగును.
27 మం. శ్రీ సరస్వతీ పూజా.
28 బు. శ్రీ దుర్గాపూజా; దుర్గా బలిదానం.
29 గు. శ్రీ భ్రమరాంబా దేవ్యాః సహస్ర ఫలార్చనం, మహానవమీ, దేవీపూజా.
30 శు. విజయ దశమీ, శమీయాత్రా; శమీపూజా; శ్రీ భ్రమరాంబా మల్లికార్జునస్వామినాం పారువేటోత్సవః; రావణాసురవాహన సేవా. కలశోద్వాసనం; బలిదానం.
అక్టోబ శ్రీ మల్లికార్జునస్వామినాం మాసోత్సవః; మహారుద్రాభిషేకః; శ్రీ
3 సో. భ్రమరాంబా మల్లికార్జునస్వామినాం రావణాసుర వాహనసేవా.

4 మం. శ్రీ మల్లికార్జునస్వామినాం న్యాసాభిషేక మహోత్సవః; శ్రీ భ్రమ రాంబా దేవ్యాః కుంకుమపూజా మహోత్సవః; లక్ష కుంకుమార్చనా; చండీ మూలమంత్ర జపానుష్ఠాన తర్పణ హోమాదయః.

8 శు. శ్రీశైలక్షేత్రే కృత్తికాదర్శనం. శ్రీ రత్నగర్భ వినాయకస్వామినాం ఉపనిషన్మంత్రాభిషేకః; గణపత్యుత్సవః. శ్రీరత్నగర్భమూలమంత్ర జప తర్పణ హోమాదులును; సహస్రనామ పూజలును జరుగును.

16 మం. శ్రీశైలక్షేత్రే మాసశివరాత్రిః; శ్రీ మల్లికార్జునస్వామినాం మహారుద్రాభిషేకః; నరకచతుర్దశీ, మహాభిషేక మహోత్సవః; శ్రీ భ్రమరాంబా మల్లికార్జునస్వామినాం కైలాసవాహనసేవా. శ్రీ మల్లికార్జునస్వామినాం మహాన్యాసపూర్వక మహారుద్రాభిషేకః; (121 ఆవృతులు) లక్షబిల్వార్చన; పంచకాతక పారాయణ; పంచాక్షరీ మూలమంత్ర జప తర్పణ హోమాదయః.

18 బు. శ్రీ మల్లికార్జునస్వామినాం న్యాసాభిషేకః;దీపావళి30న్య; సహస్ర దీపోత్సవః; దేవీపూజా.

## శ్రీ చాంద్ర కార్తీకమాసః

అక్టోబ శ్రీశైలక్షేత్రే పాతాళగంగాయాం కార్తీకస్నానారంభః; నక్తవ్రతారంభః; ఆకాశదీపారంభః.

21 శు.

28 ఆ. శ్రీ రత్నగర్భ వినాయకస్వామినాం ఉపనిషన్మంత్రాభిషేకః; నాగచతుర్థీ అభిషేకోత్సవః. గణపత్యుత్సవః. శ్రీ రత్నగర్భ మూలమంత్ర జప తర్పణ హోమాదులును; సహస్రనామ పూజలును జరుగును.

నవంబ శ్రీ మల్లికార్జునస్వామినాం మాసోత్సవః; మహారుద్రాభిషేకః;

1 మం. శ్రీ భ్రమరాంబా మల్లికార్జునస్వామినాం రావణాసుర వాహనసేవా.

2 బు. శ్రీ మల్లికార్జునస్వామినాం న్యాసాభిషేకః; శ్రీ భ్రమరాంబాదేవ్యాః సహస్రఫలార్చనం. కుంకుమార్చనం; జ్వాలాతోరణ మహోత్సవః. శ్రీ భ్రమరాంబా మల్లికార్జునస్వామినాం కైలాసవాహనసేవా. శ్రీ భ్రమరాంబాదేవ్యాః లక్షకుంకుమార్చనా; చండీ మూలమంత్ర జపానుష్ఠాన తర్పణ హోమాదయః.

3 గు. శ్రీశైలక్షేత్రే పాతాళగంగాస్నాన పుణ్యదినం.

4 శు. శ్రీ మల్లికార్జునస్వామినాం కృత్తికాదర్శనం.

7 సో. శ్రీ రత్నగర్భ వినాయకస్వామినాం ఉపనిషన్మంత్రాభిషేకః; గణపత్యుత్సవః. శ్రీ రత్నగర్భ మూలమంత్ర జపతర్పణ హోమాదులును; సహస్రనామ పూజలును జరుగును.

17 గు. శ్రీ మల్లికార్జునస్వామినాం మహారుద్రాభిషేకః, అభిషేకోత్సవః, బిల్వయాత్రామహోత్సవం, మాసశివరాత్రిః. శ్రీ భ్రమరాంబా మల్లికార్జునస్వామినాం కైలాసవాహనసేవా. శ్రీ మల్లికార్జునస్వామినాం మహాన్యాసపూర్వక మహారుద్రాభిషేకః, (121 ఆవృతులు) లక్ష బిల్వార్చన, పంచకాకాతక పారాయణ, పంచాక్షరీ మూలమంత్ర జపతర్పణ హోమాదయః.

18 శు. శ్రీ మల్లికార్జునస్వామినాం న్యాసాభిషేకః.

నవంబరు  శ్రీ చాంద్ర మార్గశీర్షమాసః

22 మం. శ్రీ రత్నగర్భ వినాయకస్వామినాం ఉపనిషన్మంత్రాభిషేకః: అభిషేకోత్సవః, గణపత్యుత్సవః. శ్రీ రత్నగర్భమూలమంత్ర జపతర్పణ హోమాదులును, సహస్రనామ పూజలును జరుగును.

డిశంబరు శ్రీ మల్లికార్జునస్వామినాం మాసోత్సవః, మహారుద్రాభిషేకః,
1 గు. రావణాసురవాహనసేవా. కృత్తికాదర్శనం.

2 శు. శ్రీ మల్లికార్జునస్వామినాం న్యాసాభిషేకః. శ్రీ భ్రమరాంబా దేవ్యాః లక్షకుంకుమార్చనా. చండీమూలమంత్రజపానుష్ఠాన, తర్పణ, హోమాదయః.

6 మం. శ్రీ రత్నగర్భ వినాయకస్వామినాం ఉపనిషన్మంత్రాభిషేకః: గణపత్యుత్సవః. శ్రీ రత్నగర్భ మూలమంత్ర జపతర్పణ హోమాదులును, సహస్రనామ పూజలును జరుగును.

16 శు. మాసశివరాత్రిః, శ్రీ మల్లికార్జునస్వామినాం మహారుద్రాభిషేకః శ్రీ భ్రమరాంబా మల్లికార్జునస్వామినాం కైలాసవాహనసేవా. శ్రీ మల్లికార్జునస్వామినాం మహాన్యాసపూర్వక మహారుద్రాభిషేకః. [121 ఆవృతులు] లక్షబిల్వార్చన, పంచకాతక పారాయణ, పంచాక్షరీ మూలమంత్ర జపతర్పణ హోమాదయః

17 శ. శ్రీ మల్లికార్జునస్వామినాం న్యాసాభిషేకః.

డిశంబరు  శ్రీచాంద్ర పుష్యమాసః

21 బు. శ్రీ రత్నగర్భ వినాయకస్వామినాం ఉపనిషన్మంత్రాభిషేకః. గణపత్యుత్సవః. శ్రీ రత్నగర్భ మూలమంత్ర జపతర్పణ హోమాదులును, సహస్రనామ పూజలును జరుగును.

29 గు. శ్రీ మల్లికార్జునస్వామినాం కృత్తికాదర్శనం.

31 శ. శ్రీ మల్లికార్జునస్వామినాం మాసోత్సవః, మహారుద్రాభిషేకః. శ్రీ భ్రమరాంబా మల్లికార్జునస్వామినాం రావణాసురవాహనసేవా.

జనవరి 1961

1 ఆ. శ్రీ మల్లికార్జునస్వామినాం న్యాసాసాభిషేకః, ఆర్ద్రాదర్శనం. శ్రీ భ్రమరాంబాదేవ్యాః లక్షకుంకుమార్చనా, చండీ మూలమంత్ర జపానుష్ఠాన, తర్పణ, హోమాదయః.

5 గు. శ్రీ రత్నగర్భ వినాయకస్వామినాం ఉపనిషన్మంత్రాభిషేకః, గణపత్యుత్సవః. శ్రీ రత్నగర్భ మూలమంత్ర జపతర్పణ హోమాదులును, సహస్రనామ పూజలును జరుగును.

11 బు. శ్రీ గంగా పార్వతీ మల్లికార్జునస్వామినాం కల్యాణాంగభూతం అంకురారోపణం. పంచాహ్నికదీక్ష ప్రారంభః. ఈ పంచాహ్నిక దీక్షలో ప్రతిరోజున పంచాక్షరీ, గణపతి, కాలభైరవ మూల మంత్ర జపములు, తర్పణములు, హోమములు: చండీమూల మంత్రానుష్ఠానము, హోమము; సప్తశతి పారాయణ హోమము నిత్య సూర్య నమస్కారములు, వేదపారాయణ, పంచకాతక పారాయణాదులు జరుగును. ధ్వజారోహణం, అగ్నిప్రతిష్ఠాపనం

12 గు. నిత్యోపాసన, రావణాసురవాహన సేవా.

13 శు. బాలహరణ. నిత్యోపాసన, కైలాసవాహనసేవా.

14 శ. శ్రీ పార్వతీ మల్లికార్జునస్వామినాం కల్యాణోత్సవః, నందివాహనసేవా.

15 ఆ. శ్రీ పార్వతీ మల్లికార్జునస్వామినాం రథోత్సవః; మాసశివరాత్రిః. శ్రీ మల్లికార్జునస్వామినాం మహారుద్రాభిషేకః, శ్రీ భ్రమరాంబా మల్లికార్జునస్వామినాం కైలాసవాహన సేవా. శ్రీ మల్లికార్జునస్వామినాం మహాన్యాసపూర్వక మహారుద్రాభిషేకః, [121 ఆవృతులు] లక్షబిల్వార్చన, పంచకాలక పారాయణ, పంచాక్షరీ మూలమంత్ర జపతర్పణ హోమాదయః.

16 సో. శ్రీ మల్లికార్జునస్వామినాం న్యాసాభిషేకః, పంచాహ్నికదీక్ష విసర్జనం, ధాన్యకుట్టనము, అవభృథ ఉత్సవము, వసంత సేవా, చండీ హోమము, పూర్ణాహుతి, రాత్రికి నాకబలి ధ్వజావరోహణం.

## శ్రీ చాంద్ర మాఘమాసః

జనవరి పాతాళగంగాయాం మాఘస్నానారంభః. రాత్రికి పవళింపుసేవా

17 మం. పుష్పయాగోత్సవః. సువాసినీ పూజా.

20 శు. శ్రీ రత్నగర్భ వినాయకస్వామినాం ఉపనిషన్మంత్రాభిషేకః, గణపత్యుత్సవః. వసంతపంచమీ, రావణాసురవాహనసేవా. శ్రీ రత్నగర్భ మూలమంత్ర జపతర్పణ హోమాదులును, సహస్రనామ పూజలును జరుగును.

25 బు. శ్రీ మల్లికార్జున స్వామినాం కృత్తికాదర్శనం.

30 సో. శ్రీ మల్లికార్జునస్వామినాం మాసోత్సవః, మహారుద్రాభిషేకః, శ్రీ భ్రమరాంబా మల్లికార్జునస్వామినాం రావణాసురవాహనసేవా.

31 మం. శ్రీ మల్లికార్జునస్వామినాం న్యాసాభిషేకః. శ్రీ భ్రమరాంబా దేవ్యాః లక్షకుంకుమార్చనా, చండీ మూలమంత్ర జపానుష్ఠాన తర్పణ, హోమాదయః.

ఫిబ్రవరి శ్రీ రత్నగర్భ వినాయకస్వామినాంఉపనిషన్మంత్రాభిషేకః, గణ

4 శ. పత్యుత్సవః. శ్రీరత్నగర్భ మూలమంత్ర జపతర్పణ హోమాదులును, సహస్రనామ పూజలును జరుగును.

10 శు. శ్రీ భ్రమరాంబా మల్లికార్జునస్వామినాం వివాహాంగభూతం అంకురారోపణం, ధ్వజారోహణం.

11 శ. శ్రీ భ్రమరాంబా మల్లికార్జునస్వామినాం రావణాసురవాహనసేవా.

12 ఆ. శ్రీ భ్రమరాంబా మల్లికార్జునస్వామినాం కైలాసవాహనసేవా.

13 సో. మహాశివరాత్రిః శ్రీ మల్లికార్జునస్వామినాం మహారుద్రాభిషేకః. శ్రీ భ్రమరాంబా మల్లికార్జునస్వామినాం కల్యాణోత్సవః, నందివాహనసేవా. శ్రీ మల్లికార్జునస్వామినాం మహాన్యాసపూర్వక మహారుద్రాభిషేకః, [121 ఆవృతులు] లక్షబిల్వార్చన. పంచకాలక పారాయణ, పంచాక్షరీ మూలమంత్ర జపతర్పణ హోమాదయః.

14 మం. శ్రీ భ్రమరాంబా మల్లికార్జునస్వామినాం రథోత్సవః. రథాంగ హోమం. బల్యుత్సః. శ్రీ మల్లికార్జునస్వామినాం న్యాసాభిషేకః.

15 బు. శ్రీ భ్రమరాంబా మల్లికార్జునస్వామినాం వసంతోత్సవః, నాకబలి. దీక్షావిసర్జనం. అవభృథోత్సవః, ధ్వజావరోహణం.

## శ్రీ చాంద్ర ఫాల్గుణమాసః

ఫిబ్రవరి శ్రీ భ్రమరాంబా మల్లికార్జునస్వామినాం పవళింపుసేవా

16 గు. మహోత్సవః.

18 శ. శ్రీ రత్నగర్భ వినాయకస్వామినాం ఉపనిషన్మంత్రాభిషేకః, గణపత్యుత్సవః. శ్రీరత్నగర్భ మూలమంత్ర జపతర్పణ హోమాదులును సహస్రనామ పూజలును జరుగును.

21 మం. శ్రీ మల్లికార్జున స్వామినాం కృత్తికాదర్శనం.

28 మం. శ్రీ మల్లికార్జునస్వామినాం మాసోత్సవః, మహారుద్రాభిషేకః,

మార్చి శ్రీ భ్రమరాంబా మల్లికార్జునస్వామినాం రావణాసుర వాహనసేవా.

2 గు. కామదహనం. శ్రీ మల్లికార్జునస్వామినాం న్యాసాభిషేకః, శ్రీ భ్రమరాంబా మల్లికార్జుస్వామినాం పల్లకీసేవా మహోత్సవః. శ్రీ భ్రమరాంబా దేవ్యాఃలక్షకుంకుమార్చనా, చండీ మూలమంత్ర జపానుష్ఠాన. తర్పణ, హోమాదయః.

3 శు. శ్రీ భ్రమరాంబా మల్లికార్జునస్వామినాం వసంతోత్సవః, నంది వాహనసేవా.

6 సో. శ్రీ రత్నగర్భ వినాయకస్వామినాం ఉపనిషన్మంత్రాభిషేకః, గణపత్యుత్సవః. శ్రీరత్నగర్భ మూలమంత్ర జపతర్పణ హోమాదులును, సహస్రనామ పూజలును జరుగును.

15 బు. మాసశివరాత్రిః, శ్రీ మల్లికార్జునస్వామినాం మహారుద్రాభిషేకః, శ్రీ భ్రమరాంబా మల్లికార్జునస్వామినాం కైలాసవాహనసేవా. శ్రీ మల్లికార్జునస్వామినాం మహాన్యాసపూర్వక మహారుద్రాభిషేకః. [121 ఆవృతులు] లక్షబిల్వార్చన, పంచశాతకపారాయణ, పంచాక్షరీ మూలమంత్ర జపతర్పణ హోమాదయః.

16 గు. శ్రీ మల్లికార్జునస్వామినాం న్యాసాభిషేకః.

---

## వత్సరాదికృత్యం

శ్లో॥ అబ్దాదౌబంధుసంయుక్తో । మంగళస్నాన మాచరేత్ । వస్త్రాభరణైర్దేహ మలంకృత్య తతశ్శుచిః ।నవగ్రహాంశ్చపఞ్చాఙ్గమ్ శ్రీగణేశంచ శారదం । దైవజ్ఞమపి సంపూజ్య సాన్వయస్సపురోహితః । బ్రాహ్మణైర్నింబకుసుమం గుడమామ్ల సమన్వితం । భక్షయేత్పూర్వ యామేతు తద్వర్షం విజయీభవేత్ । మృష్టాన్నం భోజనం కృత్వా గంధ కస్తూరి లేపనం । నానావిధాని కుర్వీత గీత వాద్యానికానిచ । సాయం కాలాత్మకం సూర్యం పఞ్చాఙ్గగణితాగతం ॥ తిథివారాదికం సర్వం శృణుయాత్తత్ఫలంచవై॥

తా॥ వత్సరాదియందు బంధువులతో గూడుకొని మంగళస్నానము జేసి పట్టువస్త్రములు, సువర్ణాభరణములు ధరించి గణపతిని, నవగ్రహములను, సరస్వతిని, పంచాఙ్గమును, దైవజ్ఞుని, పురోహితుని పూజించి బ్రాహ్మణులచే చేయబడిన వేపపువ్వు, మామిడిపిందెలు (టెంకముదరనికాయలు) కొత్త చింతపండు, బెల్లము, తేనెగల పంచామృతము (పచ్చడి)ను ప్రాతః కాలసమయమున త్రాగి, మృష్టాన్నభోజనముజేసి సాయంకాలసమయమున గంధకస్తూర్యాద్యలంకృతుడై నానావిధ గీత, మంగళవాయిద్యములువిని కాలాత్మడగు సూర్యభగవంతు నుపాసించి పంచాఙ్గఫలంబునువిని యనుష్ఠానపరులగువారు సంవత్సరమంతయు ప్రతికార్యమునందును దిగ్విజయము పొంది, సకలైశ్వర్యముల ననుభవించి శశ్వద్విశ్వప్రకాశితమగుశాశ్వతకీర్తిని సంపాదించగలుగుదురు.

ప్రచురణ:— దాచేపల్లి కిష్టయ్య అండ్ సన్సు, పుస్తకముల వ్యాపారము.
సికింద్రాబాదు — హైద్రాబాదు — వరంగల్లు.

## శార్వరిసంవత్సర ఫలితాంశం

ఈ సంవత్సరమున రాజుచంద్రుడు, మంత్రిబుధుడు, సేనాధిపతి కుజుడగుటయు రవికి ४ ఆధిపత్యములును, చంద్రునకు ३ ఆధిపత్యములును, కుజునకు ౧౩, బుధునకు ౩, గురునకు ౨, శుక్రునకు ౭, శనికి ౬ ఆధిపత్యములు కలుగుటవలన శుభగ్రహములకు ౧౫ ఆధిపత్యములును, పాపగ్రహములకు ౨౩ ఆధిపత్యములును వచ్చుటవలన శుభఫలితములకన్న అశుభఫలితములే ఎక్కువగా జరుగుచుండును. ప్రపంచరాజనీతిజ్ఞులలో చాలామంది సైనికకూటములలో చేర ప్రయత్నింతురు. రాజుచంద్రుడు, మంత్రి బుధుడు, సేనాధిపతి కుజుడగుటవలన యుద్ధభయము సుమారుగాయుండును. పైముగ్గురకును ఒకరిపై నొకరికి శత్రుభావములుండుటవలన పదవికి "ట్రియాంగిల్ ఫైట్" జరుగుచుండును. సిరియా, జోర్డాన్, ఇరాఖ్, ఆఫగనిస్థాన్ మొదలగు మధ్యప్రాచ్యదేశములలో అధికారులుమారునవకాశములుగలవు. శాంతివాదులకన్న, యుద్ధవాదులకు బలము పెరుగుచుండును. అచ్చటచ్చట సమ్మెలు మొదలగునవి జరుగుచున్నను ప్రభుత్వవిధానములో లోపముగాని మార్పుగాని యుండదు. ఈ సంవత్సరము ధనవంతుల కనుకొన్నంత లాభములు రాకున్నను, పన్నులవలన, ప్రభుత్వము తలపెట్టిన కార్యములకు దానముజేయుటవలన చాలా బాధపడుదురు. జగల్లగ్నము మిథునమైనందున నది యుద్ధము, పూర్వమున, ధాన్యనష్టము, ఉత్తర దక్షిణములందు మేఘములు, ఛత్రభంగము విరోధమును అగును. మధ్యదేశమున ధనోత్పత్తి, పశురోగమునగును. వర్షలగ్నము కర్కాటకమైనందున పశ్చిమరాష్ట్రములలో పంటలు సరిగాపండక దుర్భిక్షము సంభవించును. ఇరుగుపొరుగు రాజ్యాలతో తనహక్కును, తనబాధ్యతను, తనధర్మములు కాపాడుకొనుటకుగాను

భారతి ప్రభుత్వము కొంత కరకుదనముగా ప్రవర్తింపవలసివచ్చును. ఆగ్నేయదిగ్భాగ రాష్ట్రములందు భూకంపాద్యుపద్రవములు, వర్షాభావముచే పంటలు లేకుండుట, ధనహాని, జనహాని గల్గును. ఈశాన్య దిగ్భాగ రాష్ట్రములయందు గోధుమలు బాగుగా పండును. శాగితవు ధర పెరుగును. మద్రాసు, కొచ్చిన్, విశాఖపట్టణ రేవులలో సమ్మెలు మొదలగునవి జరుగు నవకాశములు గలవు. ఈ సంవత్సరము అనగా శక ౧౮౭౨ లో రెండు చంద్రగ్రహణములును, మూడు సూర్యగ్రహణములునుగలవు. రెండు చంద్ర గ్రహణముల విడుపు మాత్రమే హైదాబాదుకు కనుపించును. ఒక సూర్య గ్రహణము ఇండియాలో కొద్దిభాగము (హైదాబాద్, కలకత్తా మినహా) కనుపించును. మిగతా రెండు సూర్యగ్రహణములు ఇండియాలో కనుపించవు. వ్యాపారము విదేశములతో సంబంధించునవకాశములు చాలాకలవు. కొన్ని విచిత్రరోగములు సంభవించుటచే జనులు చాలా భయపడుదురు. అక్రమములను నాశనముచేసి సేద్యము ప్రారంభింతురు. వారి వారి మతములను ప్రతిదేశమువారును గౌరవింతురు. స్త్రీలు రాజ్యాంగమున గొప్ప పేర్లను సంపాదింతురు. విమానములు దెబ్బతినును. పాశ్చాత్యులు విమానయానమువలన చాలా దెబ్బతిందురు. సంకరజాతివారు, ఆటవిక జనులు, దొంగలు నశించుదురు. రాజులు క్షీణదశకువత్తురు. జనులు ఆకటిబాధల చేతను, వ్యాధులచేతను, శస్త్రాస్త్రభయములచేతను పీడింపబడుదురు. సంవత్సరాంతమున భయోత్పాతము లధికము. అధికవర్షములు, యవనదేశమున కష్టము లధికము. పురోహితులకు, బ్రాహ్మణులకు, వైద్యులకు, రాజులకు హాని కలుగును. ఉజ్జయినీ రాష్ట్రపాలకులకు నష్టముగలుగును, చైత్రమానమున శాల్యవర్షముకురియును. వైశాఖమాసమున తొలకరివాన లారంభించును. శ్రీకృష్ణునకు పశుపాలకత్వము లభించుటవలన పశువులకువృద్ధి, సుభిక్షము, పంటలు బాగుగా ఫలించుటచే ధాన్యాదుల ధరలు క్రిందటి సంవత్సరముకంటె తగ్గును. నాలుగుతూములవర్షము. పది వీసముల పంటను కలిగి దేశము సుభిక్షముగానుండును. స్వస్తి సర్వేషాం సమస్త సన్మంగళాని భవన్తు. సర్వేజనాస్సుఖినో భవంతు. శ్రీ, శ్రీ, శ్రీ, శ్రీ, శ్రీ.

## వ్యవహారమాన నిరూపణమ్

అథాస్మిన్ దేశే లోకవ్యవహారార్థం చాంద్రమానాబ్దో గ్రాహ్యః। వింధ్యస్యోత్తరదేశే బార్హస్పత్యమానాబ్దో గ్రాహ్యః (బార్హస్పత్యమానేన పరీధావినామ సంవత్సరః) అయమేవఫలప్రదర్శనార్థం చాంద్రసౌరమానాభ్యాం గ్రాహ్యః। చాంద్రసౌరమానాభ్యాం శార్వరినామ సంవత్సరః। అతశ్శార్వరినామసంవత్సరస్య రాజాదయోర్లిఖ్యంతే॥



## శార్వరి సంవత్సరస్య ఫలమ్

శ్లో॥ మేదనీశుష్యతే సర్వా ధనధాన్య ప్రపీడనం ।
శార్వర్యాం వర్షతే క్వాపి పీడ్యంతే మానవాభువి॥
శార్వరీవత్సరే సర్వసస్యవృద్ధి రనుత్తమా ।
రాజానోవిలయంయాంతి పరస్పరజయేచ్ఛయా॥

ప్రపంచ మందంతటను ధనధాన్యములకొరత యేర్పడును; అకాల వర్షములును, రోగపీడలును ఉండును. రాజులు పరస్పర జయాభిలాషులై కలహించుచుందురు. ప్రజాహానియుండును.

## శార్వరి వత్సరాధిపతి కుజఫలమ్

అల్పవృష్టి, ప్రజాక్షయము, రాజకీయ వడిదుడుకులు, చైత్రాది మాసత్రయమున ఆహార ధాన్యముల ధరలు సరసము, ఆషాఢాది ద్వయ

మున అధిక వర్షములు, భాద్రపదమున వర్షావరోధములు, రాజకీయ కల్లోలములు, ప్రజాక్షోభము, ఆశ్వయుజమున రోగములు, పశ్చిమదేశము లందు దుర్భిక్షము, తూర్పుదేశములందు సుభిక్షము. కార్తికాది మాస ద్వయమున ఆహార ధాన్యముల ధరలు పెరుగును. పౌషాది మాసత్రయ మున ఆహార ధాన్యముల ధరలు సరసమగును.

## శ్రీ శార్వరినామ సంవత్సర నవనాయకులు-వారి ఫలమ్

1. రాజా చంద్రః
2. మంత్రీ బుధః
3. సేనాధిపో కుజః
4. సస్యాధిపో శనిః
5. ధాన్యాధిపో గురుః
6. అర్ఘాధిపో కుజః
7. మేఘాధిపో కుజః
8. రసాధిపో రవిః
9. నీరసాధిపో శుక్రః
10. పురోహితో శనిః
11. పరీక్షకో శుక్రః
12. గ్రామపాలకో కుజః
13. గణితజ్ఞః రవిః
14. దైవజ్ఞో కుజః
15. అశ్వాదిపో బుధః
16. గజాధిపో శనిః
17. పశ్వాధిపో కుజః
18. దేవాధిపో శుక్రః
19. నరాధిపో కుజః
20. గ్రామాధిపో శుక్రః
21. వస్త్రాధిపో రవిః
22. రత్నాధిపో కుజః
23. వృక్షాధిపో గురుః
24. జంగమాధిపో శుక్రః
25. సర్పాధిపో రవిః
26. మృగాధిపో కుజః
27. జగల్లగ్నాధిపో బుధః
28. శుభాధిపో చంద్రః
29. స్త్రీణామధిపో కుజః
30. కోశాధిపో శనిః
31. రణాధిపో కుజః
32. ఛత్రాధిపో శుక్రః
33. అజాధిపో కుజః
34. వ్యవహారాధిపో శుక్రః
35. వ్యాపారాధిపో కుజః
36. వర్షాధిపో శుక్రః
37. తటాకాధిపో శనిః
38. లోహాధిపో శనిః

## చంద్రస్య రాజఫలమ్

శ్లో॥ గోధూమశాలీక్షు మతీ ధరిత్రీ యాపైర్విచిత్రాధ్వర వేదనాదైః !
విభాంతి గావః పయసా విశిష్టాః దుగ్ధాబ్ధిజే వర్షపతౌ శశాంకే॥

రాజు చంద్రుడగుటచే పాడిపంటలు, వర్షములు, ప్రజా సుఖము ఉండును. ఆహార ధాన్యముల కొరతయున్నను ప్రజలెట్లో జీవితము గడుపుదురు. ప్రజలు కామాసక్తులై స్త్రీలోలురై యుందురు. స్త్రీలకు పురుషుల కన్న యధికారములు కావలెనని కోరుదురు. యాగము లధికను, యాగములచే వేదనాద మధికము, గోజాతి పశువుల ధరలు బాగుగా పెరుగును.

## రాజవాహన అశ్వఫలమ్

శ్లో॥ అశ్వారూఢే వత్సరశ్చ భూమి కంపో మహాభయం।
రాజానో విగ్రహార్యాంతి వృష్టినాశో మహార్ఘతా॥

రాజు అశ్వారూఢుడై యున్నందున యీ సంవత్సరమున భూకంపాద్యుపద్రవములు, రాజ యుద్ధము, వర్షాభావముచే పంటలు లేకుండుట, ఆహార ధాన్యముల కొరతచే ధాన్యాదుల ధరలు పెరుగుట, దుర్భిక్షము, జనహాని, మానహాని, ధనహాని యుండును.

## బుధస్య మంత్రిత్వ ఫలమ్

శ్లో॥ మంత్రిణి శశాంకతనయే ప్రభూత వాయు ర్నిరంతరం వాంతి।
మధ్యమ ఫలదా ధరణీ విభాతి సురసదృశ లోకైశ్చ॥

శశిసుతే శుభ మంత్రి సమాగతే స్వపతినా కురుతే మదనక్రియాం।
బహుధనం బహు వారిసమన్వితం యవమసూరి చణాన్న మహార్ఘతా॥

మంత్రి బుధుడగుటచే గాలి వీచును. సస్యములు మధ్యమ ఫలదము లగును. లోకము సుఖించును. స్త్రీలు తమ ప్రియులను సుఖపూర్వక భోగ విలాసములతో తృప్తిపరచెదరు. ధనధాన్య సమృద్ధి యుండును. గోధుమలు, యవలు, ఆవాలు, మినుములు, సెనగలు, వేరుశనగకాయలు, ప్రత్తి, వెండి, నార, గోనెసంచులు, కాగితము, కలప, వ్యాపారవాటాలు, నూనెగింజలు, నూనె వాటాల ధరలు పెరుగును.

## కుజస్య సేనాధిపతిత్వ ఫలమ్

శ్లో॥ ఆతంకపీడా భువిసస్యనాశో లోకా స్సమస్తా జ్వరితా భవంతి।
అత్యంత యుద్ధం క్షితిపాలకానాం సైన్యాధిపత్యే ధరణీ సుతస్య॥
అవనిజేగధ నాయకతాంగతే వివిధ దుఃఖవియోగ సమన్వితః।
జనపదేశు జనాః క్రియవిక్రియే భయ విశేషత యానఫలంక్వచిత్॥

కుజుడు సేనానాయకుడగుటచే సస్యహాని, రోగ భయము, ఈతి బాధలు, యుద్ధ భయము కలుగును. సేనాధిపతు లత్యుగ్ర యుద్ధము నారంభింతురు. ప్రజలు నానా విధములుగా దుఃఖములు, వియోగములు; ననుభవింతురు. వ్యాపారమునందు వడిదుడుకులు భయోత్పాతములుండును; వ్యాపారము స్తంభించి యుండునట్టుల ప్రజాకలహములు ముఖ్యరేవులలో నను భవించును.

## శనే స్సస్యాధిపతిత్వ ఫలమ్

శ్లో॥ తిలమాష కుళుత్థాది కృష్ణధాన్యానియానిచ।
కృష్ణ భూమి స్సుఫలితా మందే సస్యాధిపే సతి॥

పూర్వ సస్యాధిపతి శని యగుటచే నల్లని ధాన్యములు, నల్లని భూమియు బాగుగ ఫలించును. నువ్వులు, మినుములు, అవిసెలు, నల్ల ధాన్యములు, ఉలవలు, చింతపండు, పొగాకు, చర్మములు, ఇనుము, యంత్ర పరికరములు, కట్టెలు మొదలగువాని ధర సరసమగును.

## గురో ర్ధాన్యాధిపతిత్వ ఫలమ్

శ్లో॥ సువృష్టి స్సర్వదేశేషు సర్వ సస్య సమృద్ధయః।
భవంతి గావ స్సుదుఘాః గురౌ ధాన్యాధిపే సతి॥

గురుండు ధాన్యాధిపతి యగుటచే దేశమందంతటను సర్వసస్య సమృద్ధియు, సువృష్టియు గలిగి గోవులు పూర్తిగ పాలనిచ్చును.

## కుజ స్యార్ఘాధిపతిత్వ ఫలమ్

శ్లో॥ భౌమే చార్ఘపతౌ స్వల్ప వృష్టి ర్వాయు సమన్వితా।
క్వచి ద్వృష్టిః క్వచిద్ధాన్యం ప్రజారోగ్యం క్వచిత్క్వచిత్॥

కుజు డర్ఘాధిపతి యైనందుచే స్వల్పవృష్టియు, వాయువుతోగూడి యచ్చటచ్చట వర్షమును కురియును. ధాన్యము జనక్షేమంబును నచ్చటచ్చట నగును.

## కుజస్య మేఘాధిపతిత్వ ఫలమ్

శ్లో॥ మహావాయు రనర్ఘంచ స్వల్పవర్షం తథా భువి।
రక్త సస్యాని జాయంతే భౌమే మేఘాధిపే సతి॥

కుజుడు మేఘాధిపతి యైనందున గాలి యధికము, వెలలు తగ్గును, వర్షములు స్వల్పమగును, ఎర్రని ధాన్యములు ఫలించును.

## సూర్యస్య రసాధిపతిత్వ ఫలమ్

శ్లో॥ తిల తైల గుడ క్షారాద్యనేకరస జాతయః ।
శూన్యార్ఘం యాంతి తే సర్వే రవౌయది రసాధిపే॥

రవి రసనాయకుడైనందున తిలలు, నూనె, బెల్లము, ఉప్పుమొదలగు జాతులకు వెలలు తగ్గును.

## శుక్రస్య నీరసాధిపతిత్వ ఫలమ్

శ్లో॥ కర్పూరాగరు గంధానాం హేమ మౌక్తిక వాససాం ।
వృద్ధిరర్ఘేణ జాయంతే శుక్రే నీరస నాయకే॥

శుక్రుడు నీరసాధిపతి యైనందున కర్పూరము, అగరు, చందనము, బంగారము, వెండి, ముత్యములు, వస్త్రములు అధిక ధరలచే లభించును.

## పురోహితాది ఉపనాయక ఫల నిర్ణయమ్

శ్లో॥ క్రూరగ్రహ ఫలం క్రూరం శుభగ్రహ ఫలం శుభం ।
పురోహితాది సర్వేషాం భవేదీశ సముద్భవం॥

తా॥ పరీక్షక, అశ్వ, దేవ, గ్రామ, వృక్ష, జంగమ, జగల్లగ్న, శుభ, ధత్రి, వ్యవహార, వర్షాధిపతులు శుభులైనందున పైవారికి శుభము. పురోహిత, గ్రామపాలక, గణక, దైవజ్ఞ, గజ, పశు, నర, వస్త్ర, రత్న, సర్ప, మృగ, స్త్రీ, కోశ, రణ, అజ, వ్యాపార, తటాక, లోహాధిపతులు పాపులైనందున పై (వారి) వాటికి దుఃఖము, నాశనము కలుగును.

## అథ మేఘ వర్షోత్పత్తి ఫలమ్

అస్మిన్ వర్షే త్రిరాధక పరిమిత వర్షఫలమ్ ।
అథాస్మిన్ వర్షే వాయు నామకో మేఘః ।
మేరో ర్వాయవ్య దిగ్భాగే మేఘోత్పత్తిః, తత్ఫలం॥

శ్లో॥ నైవాంబు వృష్టిం కురుతే సురేశః, సమస్త ధాన్యాంబరకణ్యనాశః ।
ధారాధరస్స్యా ద్యది వాయునామా జనవ్రజస్సర్వో విహీనధామా॥

వాయునామక మేఘముగాన దేవేంద్రుడైనను వర్షమును కురిపించ జాలడు. వర్షాభావము సమస్త ధాన్యములకు హాని, సర్వసస్యములు నశించును, ప్రత్తిపంటయు నశించును, బీదవారికి నూకలుగూడా లభింపవు, పశువులకు గడ్డిగాదముల కొరత యేర్పడును, ఆకలి బాధలు, దుర్భిక్షము, ఆహారధాన్యములు, ప్రత్తి దూది వస్త్రముల ధరలు పెరుగును.

## వర్ష ప్రమాణ విభాగాః

శ్లో॥ శతయోజన విస్తీర్ణ మున్నతంతు శతద్వయం ఆఢకస్య ప్రమాణంతు దేవమానేన గణ్యతే । అష్టభాగా స్సముద్రేషు పర్వతేషు తథానవ త్రయోభాగా భువి ప్రోక్తాస్త్వేవం వర్షతిచత్రిధా॥

మూడు తూముల వర్షము. సుభిక్ష క్షేమారోగ్యములు కలుగును. సముద్రమందు ఎనిమిది భాగములును, పర్వతములందు తొమ్మిది భాగములును, భూమియందు మూడు భాగములును వర్షము. ఆఢకము బ్రాహ్మణుని హస్తగతమై యున్నందున దుర్భిక్షము, భయోత్పాతములు, ప్రజాక్షోభ, ఆహార ధాన్యముల కొరత, పాడి పంటలు క్షయించుట, ధాన్యాదులకు ధరలుహెచ్చుట సంభవించును. సంవహనామక వాయు ఫలమ్. అల్పవృష్టి. చంచలా విద్యుత్ఫలం. సువృష్టి నీచగర్జన ఫలమ్. అనావృష్టి. దధినామకో సముద్రః. సస్యానుకూల వృష్టిచే పాడిపంటల సమృద్ధి.

పద్మకో నామకో మేఘః. తత్ఫలం. పద్మకుడు భూవాహానుడుగాన జనులకు సుఖము, ఆరోగ్యము, భోగభాగ్యములు, పాడిపంటల సమృద్ధి యుండును. సావన వర్షాధిపతి కుజఫలం. అగ్ని, సర్ప, చోర, రోగ భయములు. రాజులకు యుద్ధానక్తి. సస్యములు చెడును, వర్షములు తక్కువగును.

పశుపాలకో శ్రీకృష్ణః; స్థాన సంరక్షకో యమః; గోష్ఠాద్బహిష్కర్తా యమః. శ్రీకృష్ణుడు పశుపాలకు డైనందున పశువులకు వృద్ధి, సుభిక్షము, పంటలు బాగుగా ఫలించుటచే ధాన్యాదుల ధరలు తగ్గును. పశువులకు గడ్డి, నీరు సమృద్ధిగా లభించును. ప్రజలకు పాడిపంటల సమృద్ధి, ధనధాన్య సంపత్తులు కలుగును. యమునకు గోష్ఠ పాలక, బహిష్కారత్వములు సిద్ధించుటవలన పశువులకు రోగపీడలు, అల్పవృష్టి, పాడిపంటలు తక్కువగా యుండును.

## రవి మేష సంక్రాంతి ఫలమ్

రవి మేష సంక్రమణ ప్రవేశకాలము వెలలేని కలహమును, అగ్ని భయమును అగును. బుధవార ఫలం. అతివృష్టి, అధిక ధరలు. ద్వితీయా తిథి ఫలం. రాజయుద్ధం.

## రవి ఆర్ద్రా ప్రవేశ కాలఫలమ్

మధ్యాహ్నమందగుటవలన సువృష్టియు నల్పముగ కురియును. త్రయోదశీ తిథి ఫలం. అధిక వృష్టి, ధాన్యాదుల కధికధరలు యుండును. భౌమవార ఫలం. వర్షాభావము, సస్యహాని, చోర రోగాగ్ని భయములు. రాజులకు యుద్ధము, రాజహాని యుండును. కృత్తికా నక్షత్ర ఫలం. అగ్ని భయము, వర్షాభావము కలుగును. ధృతినామ యోగఫలం. సుభిక్షము. కన్యాలగ్న ఫలం. శుభము. ఆ సమయమున చంద్రుడు ప్రథమ మండలములో నున్నందున ఫలం. సస్యానుకూల వర్షము లుండును. రోహిణి సంధినివాన ఫలం. ఖండవృష్టి యుండును. ధాన్యాదులను అమ్మక నిలువ సేతురు. ధరలు పెరుగును. పాడిపంటల కొరత యుండును. జ్యేష్ఠ శుక్ల పాడ్యమి గురువారముతో కూడియున్నందున దేశమున సుభిక్షము, ప్రజలకు క్షేమారోగ్యములు, సస్యవృద్ధి, మంచి వర్షములు, గోవులు బహుక్షీరముల నొసంగును. పాడిపంటల వృద్ధి యుండుటచే ధరలు తగ్గును. ఆషాఢ శుక్ల పంచమీయుక్త బుధవార ఫలం. సుభిక్ష క్షేమారోగ్యము లుండును. గాలి యధికముగా వీచును. ఆషాఢ శుక్ల స్వాతీయుక్త దశమీ ఫలం. అధిక వర్షము లుండును. ఆషాఢ కృష్ణ రోహిణీయుక్త ఏకాదశీ ఫలం. మధ్యమముగా ఫలించును. పుష్య బహుళ అమావాస్య యుక్త సోమవార ఫలం క్షేమము.

## మకర సంక్రాన్తి నిర్ణయము

పుష్య బహుళ ఏకాదశీ శుక్రవారం రాత్రి గం. 9-29.9 ని.లకు ది 13-1-1961 రవి మకర ప్రవేశము. ఆ సమయమున ద్వాదశీ తిథి, అనూరాధ నక్షత్రం. కౌలవాకరణము. వృద్ధినామయోగము. ఏతత్ఫలం. మిశ్రమనామక ఫలం పశువులకు సుఖమును గలుగజేయును. శంఖోదక స్నాన ఫలం సుఖ సౌఖ్యముల నొసంగును. మాషాక్షత ధారణ ఫలం. మినుముల పంట నశించును. హరిత వస్త్రధారణ ఫలం. యుద్ధజనకము. కుంకుమ గంధ లేపన ఫలం. స్త్రీ నాశనము. పగడపుష్ప ధారణఫలం. ఆకలివలన భయము. ముక్తాధారణ ఫలం. శుభదాయకము. తామ్ర

(రాగి) పాత్రి భోజన ఫలం. లోహనాశకరము. భక్ష్యాహార ఫలం. ప్రజా నాశనము. చూత (మామిడి) ఫలధారణ ఫలం. నటులు నశింతురు. వరాహవాహన ఫలం. రాజపీడ. అసి (కత్తి) ధారణ ఫలం. క్షుద్బాధ. అగ్నిభయము, వ్యాధిభయము మొదలగునవి గలుగును. పీతఛత్రి ధారణఫలమ్ శుభప్రదము. సిత పద్మధారణఫలం. శుభ ప్రదం. ఉత్తర దిగ్యానం. తద్దేశారిష్టం. ఊర్ధ్వస్థితావస్థాఫలమ్. దుర్భిక్షము, రోగములు, కల్లోలములు, సస్య హాని, అల్పవృష్టి పాడిపంటలు తగ్గుట, ధరలు పెరుగుట మొదలగు ఫలితములు జరుగును. లజ్జాచేష్టా ఫలం. ప్రజాసౌఖ్యం. కృష్ణపక్ష ఫలమ్. సుభిక్ష క్షేమారోగ్యములు



కలిగి జంతువులకు వ్యాధిభయములుండును. ద్వాదశితిథిఫలమ్. సుఖము. శుక్రవారఫలము. సుభిక్షము, క్షేమము, ఆరోగ్యము, సువృష్టి, సస్యసంపత్తు కలుగును. కర్పూరాగరుగంధములకు బంగారమునకు ముత్యములకు ధరలు హెచ్చును. సింహలగ్నఫలము. పురుషచింత.

శ్లో॥ త్రిశీర్షం ద్విముఖంచైవ చతుర్వక్త్రం త్రినేత్రికం।
లంబకర్ణం రక్తదంతం లంబభ్రూ దీర్ఘనాసికం।
అష్టబాహుం ద్విపాదంచ వికృతం కృష్ణవర్ణకం।
శతయోజన మౌన్నత్యం విస్తీర్ణం ద్వాదశ స్మృతం।
ఏవం రూపం సవిజ్ఞేయం సంక్రాంతేః పురుషస్యతు॥

దానం. శ్లో॥ తిలస్నాన తిలోద్వర్తి తిల హోమ తిలోదకే।
తిలభుక్తి స్తిలదానంచ షట్తిలాః పాపనాశనం॥

తా:- సంక్రాంతి పురుషునికి గల వాహనము, ఆయుధము, హారము, వస్త్రము, గంధ, పుష్పములను ధరించువారు విశేషముగా నష్ట పడుదురు. అతడు భుజించు నాహార దోషము నశించుటకుగాను బ్రాహ్మణులకు మృష్టాన్న భోజనము పెట్టి తృప్తి పరచవలెను. లేదా భోజన సామగ్రి, దక్షిణ తాంబూలాదులచే తృప్తిపరచవలెను. అతడు ధరించిన ఆయుధమును తప్పక పూజించవలెను. అతడు కట్టుకొనిన వస్త్రములకు సుగంధాది ద్రవ్యములకు ధరలు పెరుగును.

| | | | |
|---|---|---|---|
| బు శు | ర | | ల |
| కు కే | జగల్లగ్న కుండలి | | |
| | | | రా |
| గు శ | | చ | |

| | | | |
|---|---|---|---|
| రచ కే | | | |
| కు శు బు | వర్షలగ్న కుండలి | | ల |
| | | | |
| శ గు | | | రా |

జగల్లగ్న, వర్షలగ్న ఫలితములు సంవత్సర ఫలితాంశములో వ్రాయనైనది.

# అథ వర్షధాన్యాదయోర్లిఖ్యంతే

వర్షం ౧౩ పాళ్లు; ధాన్యం ౧౧; శీతం౧౪; తృణం౧౭; ఉష్ణం౧౩; మారుతం ౪; వర్తకావృద్ధి ౧౫; తన్నాశః ౧౫; రాజవిద్వరం ౧౧; ఉగ్రం ౫; పాపం ౫; వ్యాధి ౧౭; ఉపశమనం ౪; ఆచారం ౧౭; అనాచారం ౧౭; జన్నాని ౧౫; మరణం ౪; దేశోపప్లవం ౫; దేశస్వాస్థ్యం౧౩; చోరభయం ౧౪; తన్నాశః ౧౭; అగ్నిభయం ౩; శాంతిః ౫; మృగోపద్రవం ౧౧; మృగక్షయం ౫; కీటకభయం ౫; తన్నాశః ౧౩; మూషకోత్పత్తిః ౧౩; తన్నాశః ౫; సర్పోపద్రవం ౪; తన్నాశః ౩; కామః ౧౧; లోభః ౧౫; మోహః ౧౫; మదం ౧౧; మాత్సర్యం ౩; సుఖం ౯; దుఃఖం ౧౩; భోగః ౧౫; విడంబం ౧౫; మనోవేగం ౧౩; ద్వేషః ౯; ప్రతిష్ఠా ౩; అప్రతిష్ఠా ౧౩; ద్యూతం ౫; మత్తత ౧౩; పురుషోత్పత్తిః ౩; స్త్రీ ఉత్పత్తిః ౯; ధాతు ౧౫; భయం ౩; శౌర్యం. దుష్టనిగ్రహం ౧౧; శిష్టపాలన ౧౫; సత్యం ౧౭; అసత్యం ౫; విశ్వాసం ౪; అవిశ్వాసం ౯; దయా ౧౧; నిర్దయా ౧౩; న్యాయం ౧౫; అన్యాయం ౧౪;సస్యవృద్ధిః౮; తన్నాశః ౯; పశువ్రు ౮; తన్నాశః ౮; శుకవ్రు ౫; తన్నాశః ౪; ద్రుమకీటకభయం ౮; తన్నాశః ౮; క్షుధా ౪; తృష్ణా ౫; నిద్ర ౧౩; ఆలస్యం౧; ఉద్యోగం; ౫; శాంతం ౩; క్రోధం ౩; డంబం ౩; మిత్రభేదం ౧; సుష్టత ౧౩; రసనిష్పత్తిః; ఫలనిష్పత్తిః ౧౧; ఉత్సాహం ౯; జ్ఞానం ౫; అజ్ఞానం ౧౪; కాపట్యం ౯; నిష్కాపట్యం ౯; ధార్మికం ౧౪; అధార్మికం ౧; గోమాయువృద్ధిః ౮ తన్నాశః౮; మత్కుణివ్రు౧౧; తన్నాశః౧౩ వృశ్చికవ్రు ౧; తన్నాశః ౧౦; వ్యాఘ్రవ్రు ౧౩; తన్నాశః ౧౦,పక్షివ్రు౫; తన్నాశః ౩; ధేనువ్రు ౩; తన్నాశః ౫; మహిషవ్రు ౨; తన్నాశః ౮;

మృగవ్రు ౧; తన్నాశః ౫; ఛాగవ్రు ౮; తన్నాశః ౩; అశ్వవ్రు ౩; తన్నాశః ౫; గజవ్రు ౫, తన్నాశః ౩; ఉష్ట్రివ్రు ౨; తన్నాశః ౮; విప్రవ్రు ౩; తన్నాశః ౧; క్షత్రియవ్రు ౩; తన్నాశః ౫; వైశ్యవ్రు ౮; తన్నాశః శూద్రవ్రు ౮; తన్నాశః ౫; మ్లేచ్ఛవ్రు ౧, తన్నాశః ౧; సంకరవ్రు ౧; తన్నాశః ౧; నవరత్నవ్రు ౧; తన్నాశః ౧; మరకతవ్రు ౧; మాణిక్యవృద్ధిః ౧; వజ్రవ్రు ౧; వైడూర్యవ్రు ౧; గోమేధికవ్రు ౧; పుష్యరాగవ్రు ౧; ఇంద్రనీల ౧; ప్రవాళ ౧; మౌక్తిక ౧; ఇతరరత్న ౧; సువర్ణవ్రు ౮; రజితవ్రు ౬; తామ్రవ్రు ౧.౨.

## అథకందాయఫలాని

| అశ్వి | భర | కృ | రో | మృ | ఆర్ద్రి | పున | పుష్య | ఆశ్రే | మఘ | పూఫ | ఉఫ | హ | చిత్త |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| 6 | 1 | 4 | 7 | 2 | 5 | 0 | 3 | 6 | 1 | 4 | 7 | 2 | 5 |
| 1 | 2 | 0 | 1 | 2 | 0 | 1 | 2 | 0 | i | 2 | 0 | 1 | 2 |
| 4 | 2 | 0 | 3 | 1 | 4 | 2 | 0 | 3 | 1 | 4 | 2 | 0 | 3 |

| స్వా | విశా | అనూ | జ్యే | మూల | పూషా | ఉషా | శ్రి | ధ | శత | పూభా | ఉబా | రేవ |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| 0 | 3 | 6 | 1 | 4 | 7 | 2 | 5 | 0 | 3 | 6. | 1 | 4 |
| 0 | 1 | 2 | 0 | 1 | 2 | 0 | 1 | 2 | 0 | 1 | 2 | 0 |
| 1 | 4 | 2 | 0 | 3 | 1 | 4 | 2 | 0 | 3 | 1 | 4 | 2 |

మొదట పూజపడిన చైత్రాది నాల్గు మాసములలో వ్యాధి, మధ్య పూజపడిన శ్రావణాది నాలుగుమాసములలో నధిక ఋణము, చివరపూజ పడిన మార్గశిరాది నాలుమాసములలో స్వల్పఫలము. మూడుపూజలు పడిన నిష్ఫలము. మూడంకెలు కలసిన విజయము. అంకెలలో బేసి అంకెలుపడిన ద్రివ్యలాభము, సరి అంకెలు పడిన సమమని రూఢిగునది.

